ధ రచయితలు కథలు

# కొంటె కిష్టు

న్నారి లోకం . . . బాలసాహిత్యం

# కొంటె కిష్టు

[ కథలు ]

రచన:

వివిధ రచయితలు

చిత్రాలు:

కె. జి. ధర్

విశాలాంధ్ర ప్రచురణాలయం

విజయవాడ

# ఇందులో....




తిమ్మాపురం గ్రామంలో రంగయ్య అనే రైతుండే వాడు. అతనికి వెర్రి వెంగళాయి అయిన వెంగళాయి అనే కొడుకు ఉండేవాడు. రంగయ్య ఎట్లో తంటాలుపడి, నానా అవస్థలూపడి వెంగళాయికి ఒక చిన్న పల్లెలో పెండ్లి చేసి స్వగ్రామం చేరుకున్నాడు. పెండ్లి అయిందని వెంగళాయి ప్రతివారికీ చెప్పుకున్నాడు.

కొన్ని రోజుల తర్వాత అత్త, మామ, బావగారు పెళ్లికూతుర్ని అత్తింటికి పిల్చుకువస్తున్నామని కబురు చేశారు. సరే, కొత్త బంధువులు ఇంటికి రాబోతున్నారు కదా....! ఇంటిని చక్కగా అలంకరించారు.

'వెంగళాయీ! బుద్ధిగా........తెలివిగలవాడిలా లగరా!' అన్నారు తల్లిదండ్రులు వెంగళాయితో. తేకాదు, తండ్రి ఐన రంగయ్య వెంగళాయికి కొన్ని త్రాలు చెప్పాడు—"నాయనా! నువ్వు నీ మాంవయ్యతో వినయంగా మాట్లాడు!....అత్తతో నున్నితంగా

మెత్తగా మాట్లాడు !!.... మరి బావగారిదగ్గర మాత్రం - అతణ్ని ఎగతాళిచేసి మాట్లాడు !" అని.

ఈ మాటలన్నీ బూడిదలోపోసిన పన్నీరు అయినయ్ ! పిరికివాణ్ని యుద్ధానికి పంపేటంత బ్రహ్మాండం అయింది....మనవాణ్ని సిద్ధం చేయటం !

బంధువులు తెలియజేసినట్టు వచ్చారు. రంగయ్య, రంగయ్య భార్య....బంధువులకి అందించడం, పుచ్చుకోవడం పనుల్లో ఒత్తిడిగా ఉన్నారు. వెంగళాయి మాత్రం ఖాళీగా ఉన్నాడు. తన సిల్కు చొక్కా చూసుకొని మురిసి పోతున్నాడు.



మధ్యాహ్నం అంతా భోజనాలు చేశారు. వెంగళాయి పంచాంపచాహా తిని....అటూ యిటూ పచార్లు చేస్తున్నాడు

ఘుప్రాయాసం తీర్చుకుంటున్న మాఁవయ్య - అల్లుణ్ని పిలిచి ....“ ఏమిటి....నాయనా.... ! మీ ఊరి సంగతులు ?” అని అడిగాడు.

మాఁవయ్యతో వినయంగా మాట్లాడాలిగా ! అందుకని వెంగళాయి గట్టిగా ‘ఆవులు, ఎనుములు....ఆవులు, ఎనుములు’ అని అరవసాగాడు. మామయ్యకు తారెత్తింది...! చెవుల్లో వేళ్లెట్టుకు కూర్చున్నాడు.

ఇంతలో అత్త వచ్చి ‘ఏమిటి నాయనా యిదీ ?’ అని అడిగింది. అత్తతో సున్నితంగా మాట్లాడాలిగా... అందుకని వెంగళాయి ‘వెన్న....దూది....దూది....వెన్న’ అని అరవ నారంభించాడు.

ఈ అరుపులు విని వెంగళాయి బావమరిది పరిగెత్తుకు వచ్చాడు. అతణ్ని చూడడంతోనే—‘కొడవళ్లూ....చింతకాయలూ !’ అని అరవ నారంభించాడు వెంగళాయి.

ఇంటి పెంకు లెగిరే యీ అరుపులు చూసి బంధువులంతా పరుగెత్తుకువచ్చి....వెంగళాయిని చూచి నివ్వెర[illegible]మారు. “నాన్నా ! నువ్వు చెప్పినట్టే చేశానా ? ....” [illegible] అడిగాడు వెంగళాయి. వెంగళాయిని చూచి అంతా [illegible]రించారు !

—మాణిక్యాం, సి. వి. లక్ష్మయ్య.







ఆమెకు పిల్లల్లేరు. కాని అంతులేని డబ్బు ఉంది. ఇంట్లో ఎటు చూసినా బంగారమే. నగలు, నాణేలు, పచ్చలు, వజ్రాలు అంటే ఎక్కడాలేని మమకారం. ఎంతగానో ముచ్చటపడి ఎంతో డబ్బు వెచ్చించి ఎన్నో రకాల రత్నాలు, వజ్రాలు పోగుచేసింది. వాటిని చూసుకుని తెగ మురుసుకునేది. కనపడ్డవాళ్ల కళ్లా చూపి తన గొప్పతనాన్ని చాటుకునేది. పోను పోను గర్వం ముదిరి, ధన మదం పెచ్చు పెరిగింది. లేనివాళ్లని చూచి వెక్కిరించేది. ఎ... చేసేది.

ఓ రోజున ఓ సాధారణ కుటుంబీకుల ఇంటి... వెళ్లింది. కుశలప్రశ్నలు అయ్యాక తన మామూ... ధోరణిలో గర్వంగా 'మీ ఇంట్లో ఏమన్నా గొప్ప రత్నాల...

వజ్రాలు ఉంటే చూపిస్తావా ?' అ నడిగింది. ఆ ఇంటి ఇల్లాలు లేవని అంటే నవ్వి, ఎగతాళి చేయాలని ధనవంతు రాలి ఆశ.

ఆ ఇంటి ఇల్లాలికి రత్నాలు, వజ్రాలు లేవు. కాని చక్కని మనసు, మంచి దయా ఉన్నాయి. ధనవంతురాలి దురుద్దేశాన్ని గ్రహించింది. మారు మాటాడకుండా లోపలికి వెళ్ళింది. తన చిన్నారిబిడ్డలు కరుణబాబుని, శాంతిని తీసుకు వచ్చి చూపిస్తూ 'అమ్మా! ఇవే నా రత్నాలు, వజ్రాలు!' అని తన బిడ్డల్ని ముద్దాడింది.

గొంగ్రాలైన ధనవంతురాలి తల సిగ్గుతో వాలింది !





ఒక అడవిలో ఒక కప్ప, కోడిపిల్ల, పిట్ట, ఎలుక, పీమ - యీ ఐదూ కలిసి జతగా ఉంటున్నాయి. ఒకరోజు [illegible]లన్నీ కలసి ఒక చెఱువు గట్టుకు వెళ్లాయి.

నీటిని చూడగానే కప్పకు లేని ఉత్సాహం పుట్టుకు వచ్చింది. దానికి మిత్రులందరినీ హేళన చేద్దామనే దుర్బుద్ధికూడా పుట్టింది.

'భూమ్మీదకంటే నీళ్లలో చాలా హాయిగాను చల్లగానూ ఉంటుంది!.. రండి......నీళ్లలో షికారు వెళ్దాం...!' అంటూ కప్ప గభాలున చెఱువులోకి దుమికి

'మాకు ఈత రాదుగా!' అని, విచారించా మిగిలిన నేస్తాలన్నీ.

కప్ప బెక బెక మని 'మీరు వఠి దద్దమ్మ లన్న మాట...! నే చూడండి...!!' అంటూ పెద్దగా, పగలబడి నవ్వింది.

కోడిపిల్లా, పిట్టా, ఎలుకా, చీమా, నాలుగూకూడా కప్పదగ్గర ఓడిపోయాయి. సిగ్గుతో తలలు దించుకున్నాయి.

నాలుగూ కలిసి కప్పని ఓడించి, దాని గర్వాన్ని అణచెయ్యా లనుకున్నాయి. నాలుగూ కలిసి కూచుని ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాయి. ఏదో చిన్న ఉపాయం తట్టింది కాబోలు!

కోడిపిల్ల ఒక పెద్ద ఆకు నోట కఱుచుకు వచ్చింది.

పిట్ట వెళ్లి ఒక పొడుగాటి తాడు నొకదాన్ని తెచ్చింది.

ఎలుక పోయి ఒక కొబ్బరిచిప్ప తీసుకు... చిన్న 'కర్ర' పట్టుకొచ్చింది.

కొబ్బరి చిప్పకు కర్రని నిలువుగా గు... కర్రకు ఆకును తెరచాపలా గుచ్చి చిప్పకి త... ని ఒక అడుగువ పెట్టి 'నావ'కి లంగరు... దానిలో నాలుగూ ఎక్కికూర్చున్నాయి!

...ంకేం నావ నీళ్లలో కదిలింది. ... ...ది. మరి, లోపలకు వెళ్లకుండా తాడు ...

'నువ్వు నీళ్లలో తడసిపోయావు! మేం చూడు, హాయిగా ఎలా షికారుచేస్తున్నామో....!' అన్నాయి నాలుగూ :



కప్ప వెర్రిముఖం వేసింది! నావని చూస్తూ అలాగే ...ంది! దాని గర్వం అణగింది!!

...ందుకే పెద్దలు అన్నారు — ఎవరూకూడా ఏమి... ...కంగా కలిగిన విజయం చూసి, ఉప్పొంగి... ...త్తిపోకూడదనీ, ఆ పిచ్చికి తగిన మందు పిచ్చిలో ...ందనీ! దేనికీ గర్వం తగదు! ఒకవేళ గర... అది వెంటనే అణిగించుకోవాలి!!...

— ...రాటి విశ్వేశ్వరం





వెన్నెల తెల్లగా పుచ్చపూవులా ఉంది. రోజుకు మల్లేనే సుశీల తాత ఒళ్లో చేరి కథలు చెప్పమని మారాం చెయ్యటం మొదలుపెట్టింది. "ఎన్నో పెద్ద సంగతులు చెబుతానంటివి గదా తాతయ్యా! ఒకటన్నా చెబితే కదమ్మా ...ఏవీ చెప్పకపోతే నాకు చదువు ఎలా వస్తుందేం?"— సుశీల పట్టుపడితే పదిలిపెట్టదని తాతకు తెలుసు. బుజ్జగింపుగా అన్నాడు: "అది కాదమ్మా! సంగతులకేం బోలెడన్ని ఉన్నాయి. కాని వాటిలో ఎక్కువ భాగం చెత్త!!"

"మరేం చేస్తాం...చెత్తను వదిలేద్దాం" అంది సుశీల తడుముకోకుండా.

తాత ఆలోచిస్తూ జవా బిచ్చాడు: "అలా అయితే చాలా కొద్దిగానే మిగులుతాయమ్మా వినవలసినవి. కాని అవిమాత్రం చాలా ముఖ్యమైనవి. అందు కేవీ సందేహం లేదు."

"అలా అయితే ఆ సంగతులే చెప్పు మరి, విందాం"—సుశీల ఉత్సాహంతో లేచి కూర్చుంది.

తాత కథ చెప్పటం మొదలుపెట్టాడు.

"అనగా అనగా ఒక పడవ. ఒకనాడు పడవ తెడ్లకు, తెరచాపకు పెద్ద తగాదావచ్చింది. టప టప మని శబ్దం చేసుకుంటూ, తెడ్లన్నీ పడవవాడి దగ్గరకు వెళ్లి ఫిర్యాదు చేసినాయి. 'ఎన్నాళ్లండి ఈ మాటలు పడ్డం? ఆ పొగరుబోతు తెరచాపగాడు మమ్మల్నందరినీ అలగా జనం అంటున్నాడు. మే మంతా పడవకింద భాగంలో ఉంటామట. అస్తమానూ వళ్లు విరుచుకొని నీళ్లను అటూ ఇటూ తోస్తుంటామట. తా నేమో ఎవరి ప్రమేయం లేకుండా తన ఇష్ట మొచ్చినట్టు పోతుందట. అంచేత తనది ఉన్నత వంశ మట. మాలో ఎవరు గొప్పో మీరు నిర్ణయించాలి. మే మంతా అలగాజనం అయ్యేటట్లయితే వెంటనే ఈ పనంతా వదిలిపెట్టి పోతాం. అప్పుడు పడవ ఎలా నడుస్తుందో చూద్దాం.'

పడవవాడు రానున్న ప్రమాదాన్ని పసికట్టా[illegible]. తెడ్లను పక్కకు పిలిచి రహస్యంగా చెవిలో చెప్పా[illegible]

'తమ్ముళ్లూ! మీ రంతా తెరచాపగాడి మాటలు లెక్కపెట్ట కండి. వాడి దేముంది, వాడి మొహం! మీ రంతా పని చెయ్యకపోతే పడవ కదలగలదా ఏవిఁటి? వాడు ఉత్తప్పుడు ఎత్తున కూర్చుని విఱ్ఱవీగుతూంటాడు. కాని కాస్త గాలివస్తే అబ్బాయి పస బయటపడి ఊరుకుంటుంది. చచ్చినట్టు ముడుచుకొని కిందపడి ఉంటాడు. కష్టాల్లో సుఖాల్లో మీరేగదా నన్ను ఆదుకుంటున్నది. ఆ సంగతి నాకు తెలియనిదా: ఇంతకీ తెరచాపగాడు వట్టి మోతబరువు. మిమ్మల్ని అలగాజనం అనటానికి ఎవరికి దమ్ము లున్నాయి.'

తెడ్లు సంతృప్తితో తిరిగి పోయినాయి.

'కొంపతీసి ఈ మాటలన్నీ తెరచాపగాడు వినలేదు గదా' అని పడవవాడికి భయంవేసింది. తెరచాప దగ్గిరకి వెళ్లి సవినయంగా అన్నాడు: 'ఈ వెధవ తెడ్లెక్కడ, మీ దర్జా ఎక్కడ; నక్కకీ నాగలోకానికి ఉన్న భేద ముంటే. మీ యిష్ట మొచ్చినట్లు మీరు కదులుతారు, మిగతా వాళ్లంతా మిమ్మల్ని అనుసరిస్తారు. మీరు విశ్రాంతి తీసుకో దలిచినప్పుడు చక్కగా ముడిచిపెట్టుకుని పడుకొంటారు. ఈ అలగాజనం మాటలను లక్ష్యపెట్టకండి. వాళ్లందర్నీ కింద గట్టిగా కట్టేస్తాను. అరిచి చచ్చినా ప్రయోజనం ఉండదు."

తెరచాప గర్వంగా ఒళ్లు విరుచుకొంది.

కాని చూస్తే రోజులు బాగున్నట్లు లేవు. చెట్లు మంచి బలం కలవి. ఇవ్వాళ అవి క్రిందుగా ఉన్నాయి. కాని రేపు అవి లేచి తెరచాపను గట్టి చెంపదెబ్బ కొడితే దాని పరువు పీలికలైపోతుంది. 'వానల్లోనైనా వరదల్లోనైనా పడవను నడిపేది ఈ తెడ్లు' అనే విషయం ప్రపంచానికి అప్పుడు తెలుస్తుంది.

"చెప్పి చెప్పి భలే కథ చెప్పావే! ఇవే నేమిటి పెద్ద సంగతులంటేనూ?"— సుశీల వెక్కిరింపుగా నవ్వింది.

తాత అన్నాడు: "ఈ సంగతి ఇప్పుడు చిన్నదిగానే ఉంది తల్లీ! కాని ముందు ముందు చాలా ముఖ్యమయింది. అవుతుంది. ఈ సత్యాలు విత్తనాల్లాంటివి. అవే కాలక్రమేణా భూమిని పెళ్లగించుకుని పైకి వచ్చి ఆకులు, కొమ్మలూ తొడిగి పెద్ద చెట్లు అవుతాయి. ఇప్పుడు అర్థమైందా?"

"ఊఁ!" అంది ఓటమి ఒప్పుకొని సుశీల. కాని ముఖం చూస్తేనే ఆ చిన్ని బుర్రకు ఈ కథ కాస్తయినా అంటుపట్టలేదని తాతయ్యకు తెలిసింది.

మూలం: టాగోర్

అనువాదం: 'నర'







ఒక గ్రామంలో ఓ జమిందారుగారు ఉండేవారు. ఆయనదగ్గర ఒక దివాను ఉండేవాడు. జమిందారుగారికి ఏమీ తెలీదు. అతనికి దివానుమీద ఎక్కువ నమ్మకం ఉంది. ఆ దివాను ఎంత చెబితే అంత! ఎలా చెయ్యమంటే అలా చేసేవారు, జమీందారుగారు.

దివానుమాత్రం ఏమంత మంచివాడుకాదు. ధనాశ ఎక్కువ! జమిందారుగారిని చూడవచ్చిన వాళ్లందర్నీ అటకాయించి, తన కేదయినా కొంత ముట్టజెబితే కాని వదలనేవాడు. ఏం చేస్తారూ? అవసరమయిన పనిమీద వస్తారేమో....అలానే దివానుకు కొంత లంచం చెల్లించే వారు.

జమిందారుగారు వట్టి అమాయకులు! మంచి నై కర్యం ఏదయినా ప్రజలకు చెయ్యాలనుకున్నా ఆ విష

యమై దివానుతో చర్చించేవారు. దాని కేదో అడ్డుపుల్ల వేసి, అప్పటికా పనిని ఆపేసేవాడు దివాను.

తర్వాత ఆ సౌకర్యం చేస్తానని ప్రజలదగ్గరకూడా కొంత లంచం తిని, తిరిగి జమీందారుగారితో మాట్లాడి ఆ సౌకర్యం చేసేవాడు. ఆ పనికి అయ్యే డబ్బులోకూడా కొంత వాటా మింగేవాడు దివాను.

ఓ రైతు యీ దివానుకు తగిన శాస్తి చెయ్యాలని అనుకున్నాడు. దివానుని తెలివితేటల్తో లొంగదీయాలని అనుకున్నాడు.

జమీందారుగారు తన తోట చెఱువులో ఎన్నో రకాల చేపలను పెంచుతూ వుండేవారు. ఈ విషయం అందరకూ తెలుసు.

రైతు ఎలాగో కష్టపడి బంగారువన్నె చేప నొక దాన్ని సంపాయించాడు. ఆ చేపను తీసుకొని దివాను దగ్గరకు వెళ్లాడు.

'ఎందుకొచ్చావ్ ?' అని అడిగాడు దివాను.

అందుకు రైతు వినయంగా దివానుకు నమస్కరించి, 'నేను బంగారువన్నె చేప నొకదాన్ని తెచ్చాను. జమీందారు గారికి యిచ్చుకుంటాను. తమరి సెలవయితే....' అన్నాడు.

'మరి....నా మాటేమిటి ?' దివాను రైతు కళ్లలోకి చూశాడు.

'పేదోణ్ని .... ! మీలా టోరికి, నే నే టివ్వగలను ? నా దగ్గ రేఁమీ లేదాయె !' అన్నాడు రైతు.

'పోనీ, జమిందారుగారు ఇచ్చిన దానిలో సగం వాటా ఇస్తావా ? అలా యిష్టమయితేనే, ఒదుల్తాను. లేకుంటే ఇంటిదారి పట్టవచ్చు !' అన్నాడు ఆలోచించి దివాను.



'సగమేఁ.... !'

'అలా యిచ్చే మాటయితేనే పంపిస్తాను' అన్నాడు దివాను. చివరకు రైతు ఒప్పుకున్నాడు.

రైతు జమిందారుగారి దగ్గరకు వెళ్లాడు. బంగారు వన్నె చేపను యిచ్చాడు. జమిందారుగారు దానిని చూసి సంతోషించారు.

'ఏం విమ్మన్నావ్?' అని అడిగారు రైతుని జమిందారుగారు.

'ఓ నూరు కొరడాదెబ్బలు ఇప్పించండి!' అన్నాడు రైతు. జమిందారుగారు విస్తుపోయారు. 'మరేదయినా కోరుకో....!' అన్నారు. ఉఁ హుఁ....రైతు ఒప్పుకో లేదు.

వెంటనే, చేసేదిలేక జమిందారుగారు నౌకర్లను పిలిపించి 'వీణ్ని నూరు దెబ్బలు కొరడాతో కొట్టండి!' అని ఆజ్ఞాపించారు.

'చిన్న మనవి!' అన్నాడు రైతు.

'ఏఁవిటది?' అని అడిగారు జమిందారుగారు, రైతుని.

'దివానుగారిని పిలిపించండి!' అన్నాడు రైతు.

'దేనికీ........!?' అన్నారు జమిందారుగారు ఆశ్చర్యంగా.

'వారిని ముందు యాభై దెబ్బలు కొట్టండి! తర్వాత....'

‘ దేనికి ? ’—కొద్ది కోపంగా అడిగారు జమిందారుగారు.

‘ నేను లోపలకు వచ్చేప్పుడు దివానుగారు నన్ను అటకాయించారు. నాకు మీరు ఇచ్చే బహుమానంలో సగం యిస్తేనే లోనికి పంపుతా నన్నారు. దయచేసి....ఆ సగం వాటా ఆయనకు ఇవ్వనివ్వండి ! ’ అన్నాడు రైతు.

జమిందారు విషయాన్నంతా తెలుసుకున్నారు. ‘ అది దివానుగారికి అలవాటే ! ఆశ్చర్యపడాల్సిన అవసరంలేదు ! ’ అన్నాడు రైతు. జమిందారుగారికి విషయమంతా పూర్తిగా అర్థం అయింది.

దివానుని పిలిపించి—‘ రైతు కిచ్చిన బహుమానం మొత్తం దివానుకే యిచ్చి ఇంటికి పంపేయండి.... ! ’ అని చెప్పి, రైతుని తన మహల్లోకి తీసుకొని వెళ్లాడు.

— *గుళ్లపల్లి గంగాధరరావు*



రాను గడ్డువేసరికి ముని ఆ ఎలుగును వదిలి ఓ నిముషం ఉండలేకపోయాడు. ప్రతి క్షణమూ దానితోనే మాటాడుతూ నుష్టులు చేస్తూ ఉండకపోతే అతనికి తిక్క పట్టినట్టయ్యేది.

ఇలా కొన్ని రోజులు దొర్లినాయి.... అంతలో అలా విహారం చేయాలంటే చేయాలని ఇద్దరూ ఓ పలాటి వచ్చారు. గుట్టలు, పల్లాలు, మైదానాలు, పొదలు వగైరాలు దాటుతూ గడిచిపోయారు. ఎలుగు బాగా దృఢంగా ఉం మూలాన బిరబిర, చరచర నడిచి వెళ్ళింది. ముని పల్చగా రొక్కి రొక్కిగా ఉన్నందున చాలా వెనకాల పడిపోయాడు. పాపం!....ఎలు గాతనికోసం వేచి బిగ్గరగా కేకేసింది. "త్వరత్వరగా నడు: వచ్చి చల్లగా నీడలో కొన్ని నిద్రపోదువుగాని, నేను కాపలాకాస్తూ ఉంటాను." అందుకు ముని సమ్మతించి, పచ్చని గడ్డిపై హాయిగా పండుకొని దీర్ఘనిద్ర తీశాడు. అతని ప్రక్క కూచోని ఎలుగు కాపలా కాస్తోంది.

అంతలోనే - ఓ ఈగ ముని ముక్కుమీద వాలింది. ఎలుగు దాన్ని తోలింది. తిరిగి అది దవడమీద వాలింది. ఎలుగు కోపంతో "దూరంగా ఉండిపో" అని బెదరించింది. కాని మళ్లీ ఆ ఈగ. ముక్కుమీద తిష్టవేసింది. ఎలుగుకు కోపం ముంచుకొచ్చింది. వళ్లంతా మండిపోతోంది. "ఓసీ ఈగా! నీ వింతలేవు చూద్దానికి, నా ... ... ...

వేధిస్తున్నావు; చూసుకో నీ భరతం పట్టానిప్పుడు!" అని నోరు చించుకొంది - ఎలుగు.

ఓ లావుపాటి, బరువైన గుండును తీసికొని ప్రక్క నుంచుకొని, ఈగకోసం కాచుకూర్చుంది. ఆ సమయంలో



ఈగ సరిగ్గా ముని కనుబొమ ముడిమీద వాలబడింది. "నీ ప్రాణాలిప్పుడు నా అరచేతిలో ఉన్నాయి సుమా!" అంటూ — ఆ ఎలుగు ఆ గుండును మునిమీదున్న ఈగను చంపాలని ఎత్తివేసింది........ఇం కేముంది !........అసలే ఆ గుండు పెద్దది: అందులోనూ బరువైనదాయె;

ఆ గుండు దెబ్బకు ముని పుర్రె పచ్చడయిందంటే నమ్మండి….
ఆ మునేమో అలాగే - నిజంగా, శాశ్వతంగా నిద్రపోయాడు.

సాయ మవసరమైనపుడు సాయం చేయడము మంచిదే కాని అందులో - బుద్ధి నుపయోగించి సాయం చేయడ మత్యవసరం. చూడండి !....ఎలుగుకు బుద్ధి ఉండి కూడా దానిని సరిగా ఉపయోగించలేకపోయిందిగదా !

— ‘ మాణిక్యం ’, ‘ వల్లంకొండ ’



# దూకుడు పందెం

అనగనగా ఒక కొండ. ఆ కొండ ప్రక్కన ఒక గుంట. దాని కవతల పచ్చిక మైదానం. కొండమీద రాజుగారు. రాజుగారి కొక చక్కటి కూతురు. ఇంకా పెళ్లి కాలేదనుకోండి. తగిన సంబంధం దొరికితే క్షణమే చేయాలని ఉంది. గుంటలో ఒక బోదురుకప్ప. చూడ టానికి చాల అసహ్యం. కాని చాల గర్వం. గుంట ఒడ్డున ఒక ఈగ. నాజూకైన రెక్కలు. అందమైనదైనా అహంభావం లేదు. ఆ మైదానపు పచ్చికలో ఒక మిడత. పచ్చని కోటు. గుండ్రటి కళ్లు. ఒకరిపోలికి పోదు. ఒక్కటే ఆడుకొంటుంది. మంచి బుద్ధి కలది.

ఇలా ఉంటుండగా ఒక రోజున గుంట ఒడ్డుకు షికారు వచ్చింది, మిడత. అప్పుడే ఈగా, కప్పా ఏదో మాట్లాడుకుంటున్నాయి. పెద్దగానే అనుకుంటున్నాయి.

మన తెలుసుకుంటే పోదామనుకొంది మిడత. ఇంతలో ఇలా రమ్మని పిలిచారు వాళ్లు. పోకపోతే బాగుండదని దగ్గరకు వొచ్చింది మిడత. మిడతయ్యా, మిడతయ్యా ఈగ మాట కొంచెం వినమంది కప్ప. దూకడంలో తనే గొప్పని చెప్పుతుంది. మీ రేమంటారు అని అడిగింది ఈగ. పెద్దమనిషి కొంచెం తీర్పు చెప్పమంది కప్ప. ఈగే ఎక్కువ దూక కలదని న్యాయం చెప్పింది మిడత. కప్పకు ఈ తీర్పు రుచించలేదు. మన ముగ్గురం పందెం వేసుకుందాం. రాజుగారిని న్యాయం చెప్పమందాం. ఎవరు గెలుస్తారో చూచుకుందాం అని కప్ప ఈగనీ, మిడతనీ సవాలు చేసింది.

ముగ్గురూ కలసి రాజుగారి దగ్గరకు పోయారు. బొమరుకప్పా, ఈగా, మిడతా వచ్చినవని చెప్పారు. రాజుగారు విన్నారు. దర్బారు తీర్చారు. కూతురిని తన ప్రక్క కూర్చోబెట్టారు. ఇప్పుడు చూడండి మీ ప్రజ్ఞ. ఊరికినే పందెం ఎందుకు ? గెలిచినవారికి నా కూతురు నిచ్చి పెళ్లి చేస్తానని పలికారు. అందరూ అవునని తల ఊపారు. పందెం మొదలయ్యింది. ముందు ఈగ ఎగిరింది. ఎటు పోయిందో కనిపించలేదు. ఎంతసేపటికి తిరిగి రాలేదు. తర్వాత మిడతవంతు. ఒక్క దూకు దూకింది. రాజుగారి తలమీద వాలింది. రాజుగారు ఉలిక్కిపడ్డారు. సభ జుగుప్సించింది. అప్పుడు బయలుదేరింది బొమరుకప్ప. అన్ని వైపులా చూసింది. బుగ్గలుబ్బించి బుసబుసలు నవ్వుకొని.

చిన్న దూకుతో రాజకుమారి వళ్లోపడింది. ఇంతలో ఈగ కూడా వచ్చింది. ఇక రాజుగారి తీర్పు వినాలి. అందరూ చెవులు నిక్కించారు.

అప్పుడు రాజుగారు ఇలా అన్నారు. ఈగ ఎక్కడకు ఎగిరిపోయిందో మనం చూడలేదు. కాబట్టి అసలు ఈగ ఎగిరిందో లేదో మనకు తెలియదు. మిడత సభా మర్యాదలు తెలియకుండా రాజుగారిమీద దూకి గల్లంతు చేసింది. కాని ఈ కప్ప చక్కగా నా కుమార్తె ఒడిలో దూకింది. ఈ ప్రపంచంలో నా కుమార్తె ఒడికంటే ఉన్నతమైనది ఇంకేముంటుంది? కాబట్టి ఈ కప్ప గెలిచినట్టు భావించి, నా కుమార్తె నిచ్చి పెళ్లి చేయడానికి నిశ్చయించా నన్నారు. రాజుగారి తెలివికి, కప్పగారి తెలివికి అందరూ సంతోషంతో చప్పట్లు కొట్టారు. రాజకుమారిని కప్పగారికిచ్చి వైభవంగా పెళ్లిచేశారు. ఈగ, మిడత విచారంగా వెళ్లిపోయాయి.

ఈ లోకంలో మూర్ఖత్వానికి, డాబుసరికి జయం అనుకుంటూ ఎగిరిపోయింది ఈగ. అవు నవు నని పచ్చిక మీద దూకింది మిడత. ఎంతవరకు నిజమోకాని నాకూ ఆ మిడతే చెప్పింది! "మూర్ఖత్వానికి, డాబుసరికే ఈ లోకంలో జయం" అని....

మూలం: అండర్సన్ — అనువాదం: కశా[illegible]







నక్కబావ, పిల్లిమామ రెండూ కలిసి సాయంకాలం షికారుకు బయలుదేరాయి. వారివెంట కాలక్షేపానికి శాస్త్రాలనుగురించి మాట్లాడటం మొదలుపెట్టాయి. "పరోపకారం, మోక్షాలను" గురించి అరగంటసేపు ఉపన్యాసం దంచేసింది నక్కబావ. "దయాగుణం బహు గొప్పది" అని నక్కకు వంత పాడింది పిల్లిమామ. ఇలా చర్చించుకొంటూ వెళుతుండగా, తోడేలొకటి గొర్రెపిల్లను దయా దాక్షిణ్యం లేకుండా పట్టుకొని తినసాగింది. ఆ దృశ్యాన్ని చూసేసరికి నక్కబావకు, పిల్లిమామకు తోడేలుమీద ఆగ్రహం కలిగింది. "ఘోరం, ఘోరం" అని ఒక్కసారిగా అరిచాయి. "తినదలిస్తే ఏ దుంపో, ఏ కాయో తినవలెను గాని ఇలా నిండు ప్రాణాన్ని బలిగొనటం అన్యాయం, అక్రమం" అని నిందించుతూ తమ నడకను సాగించాయి.

అవి ఒక గ్రామాన్ని చేరుకొన్నాయి.
గుంపును చూశాయి నక్కబావ,
...ని చూడగనే నక్కబావకు నోరూరింది.
మాట్లాడుకొన్నదంతా మరచి నక్కబావ
...కురికి తన పొట్టను నింపుకొంది. ఇంతలో
...లపైపు కలుగులోంచి 'ఎలుక' ఒకటి బయటికి
...గా పిల్లిమామ దానిమీద కురికింది.

ఇదంతా గోడమీద కూర్చున్న సాలీడు చూసింది. "ఎంత ఘోరం, యెంత ఘోరం" అని కళ్లు మూసుకొంది. నేను ఈ పాపా లన్నిటికి దూరంగాఉన్నా ననుకొంది. కళ్లు తెరచేటప్పటికి తన ముందుగా ప్రాకుతూ ఒక పురుగు కనబడింది. వెంటనే దాన్ని చప్పుడులేకుండా మింగేసి తన గూటిలోకి వెళ్లి కూర్చుంది.

— బండ్లమూడి సుబ్బారావు





విజయవాడలో చదువుకొంటున్న వేణు సెలవు తన గ్రామానికి వెళ్లాడు. బస్తీలో చదువుకొంటున్నాన బడాయి ఎక్కువైంది వేణుకి. పల్లెటూరి మొద్దులకేం తెలుసు అనుకొని విర్రవీగుతున్నాడు.

వేణుకూ, వాళ్ల నాన్నకూ భోజనం వడ్డించి తనూ ఒక ప్రక్కన వడ్డించుకొని కూర్చుంది వాళ్ల అమ్మ. పట్నంలో చదివే కొడుకు ఇంటి కొచ్చాడని ఎంతో ప్రేమతో వాళ్లమ్మ కోడిగ్రుడ్లు వండింది, వేణుకి అవంటే ఇష్టమని. వేణుకు, వాళ్ల నాన్నకు చెరొకటి తినమని రెండు గ్రుడ్లు ఉంటే వాటి నొక గిన్నెలోవేసి వాళ్ల మధ్యన పెట్టింది అమ్మ. తనకి లేకపోయినా తన కొడుకు తింటే తల్లికి సంతోషంకదూ!

వేణు చూశాడు. ఇదే సమయం తన తెలివి చూపటానికి అనుకొన్నాడు!

'ఇవి రెండు గ్రుడ్లుకదూ. చూడండి. వీటిని మూడు చేస్తాను' అన్నాడు. అమ్మా, నాన్నా అలాగే చూస్తున్నారు వీడేం చేస్తాడో నని. 'ఇది వకటి' అన్నాడు



ఒకదాన్ని చూపి. 'ఇది రెండు' అన్నాడు రెండోదాన్ని చూపి. 'వీటిని కలపండి.' ఒకటి, రెండు కలిపితే మూడు. ఏమంటా రన్నట్లు జుట్టు యెగరేశాడు. తన తెలివికి తనే తబ్బిబ్బైపోయాడు.

వాళ్ల నాన్న వీడి గర్వంచూసి బుద్ధిచెప్పాలను కున్నాడు. "సరే వేణూ: ఒకటి నేనూ రెండోది అమ్మా

తింటాం. మూడో గ్రుడ్డు నీవు తిను" అని చెప్పి తనొకటి తిని వేణూఅమ్మ కొక టిచ్చాడు. గిన్నెలా నోరు తెరిచి వేణు ఖాళీ గిన్నెవంక చూశాడు. ఇంకేముంది? ఎవరికే యేం తెలియదని అతితెలివి చూపించబోతే అలాగే శాస్త్రి జరుగుతుంది.

— [illegible]






ఓ చక్రవర్తికి నరజాతి చరిత్ర మొత్తం తెలుసుకోవాలని బుద్ధి పుట్టింది. పండితులందరినీ పిలిపించి నరజాతి చరిత్ర మొత్తం వ్రాయండని ఆజ్ఞాపించాడు. రాజు తలుచుకుంటే దెబ్బలకు కొదువేముంది ?

ఆ చక్రవర్తికి రోజూ ఉదయంపూట కోటగోడ మీద పచారు చేయటం అలవాటు. కోటలో వింతలు చూడాలని పిల్లలు అదేవేళ కోటముందుకు వచ్చేవారు. చక్రవర్తికి పిల్లలంటే చిరాకు. అంచేత పిల్లల్ని కోటలోనికి రానిచ్చేవాడు కాదు. పిల్లలుమాత్రం రోజూ వచ్చి గుమ్మం ముందు నించొని తిరిగి వెళ్లిపోతుండేవారు.

ఇలా పదేళ్లు గడిచాయి.

ఓ రోజు ఉదయాన అలవాటుప్రకారం చక్రవర్తి కోట గోడమీద పచారు చేస్తున్నాడు. ముందు వందలకొలదీ

గాడిదలు పెద్ద పెద్ద దస్త్రాల్ని మోసుకొని కోటలోకి వచ్చాయి. ఆ వెనక పండితులు ప్రవేశించారు. పిల్లలు మాత్రం కోటగుమ్మం దగ్గరనుంచే వెనక్కి తిరిగి వెళ్లి పోయారు.

గాడిదలు మోసుకు తెచ్చిన 'నరజాతి చరిత్ర' దస్త్రాల్ని చూసి చక్రవర్తి పెదవి విరిచాడు. "ఇదంతా ఎప్పుడు చదవను? ఊహూఁ లాభంలేదు. కుదించి సంక్షిప్తంగా వ్రాసి తీసుకురండి!" అని పండితులను ఆజ్ఞాపించాడు.



మరో పదేళ్లు గడిచాయి.

చక్రవర్తి ముసలివా డయ్యాడు. చదావ్వు మానేశాడు. కాని, పిల్లల్ని కోటలోనికి రానీయడంలేదు.

ఈ పదేళ్లలో పండితులు చరిత్రను సంక్షిప్తంగా వ్రాశారు. ఈసారి నలుగురిచేత దస్త్రాల్ని మోయించుకు వచ్చారు. కాని, చక్రవర్తి మంచాన పడి ఉన్నాడు. అవి కూడా చదివే ఓపికలేదు. చక్రవర్తి నరజాతి చరిత్ర చదవకుండా చనిపోవడమా? అయ్యో పిల్లేమ.

పండితులు తెగ ఆలోచించారు. దస్త్రాల్ని వెనక్కి తిప్పి పంపారు.

'ప్రభూ తమ సెలవైతే నరజాతి చరిత్ర సంక్షిప్తంగా రెండు మాటల్లో చదించాం ప్రభూ! ఒకటి: భూమిమీద పుట్టడం, కష్టసుఖాలు అనుభవించి, చివరకు చావడం నరజాతి చరిత్ర ప్రభూ! ఇక, రెండు; శాశ్వతంగా ఉండేది పిల్లలు మాత్రమే ప్రభూ!" అన్నారు పండితులు.

'అలాగా!... ...ప్రజలే ఉండగా ఈ మాత్రం గ్రహించలేకపోయాను కదా!' అని గొణుక్కున్నాడు, చక్రవర్తి. కళ్ళుమూశాడు, మరి తెరవలేదు.

— [illegible]





ఇతర్లని వెక్కిరించడం కొందరికి తగని సరదా! అలాంటి వారికి అప్పుడప్పుడు తగిన శాస్తి జరుగుతూ ఉంటుందికూడా!

మా ఊళ్లో కృష్ణుడు అనే పదేళ్ల కుర్రాడుండేవాడు. వాడు ఎంత అల్లరి చేస్తాడో చెప్పలేం! కనిపించిన కుంటి వాళ్లని, గుడ్డివాళ్లని వెక్కిరించడం, కొంటెపేరుపెట్టి వాళ్లను పిలిచి గేలిచేయడం, వాళ్లమీదకు చిన్న చిన్న రాళ్ల రువ్వడం వాడిపని. నడుం వంగిపోయిన ముసలమ్మ కనిపిస్తే, తానూ వంగి నడుస్తూ, ఆమె కర్రని మధ్య మధ్య లాగుతూ ఆమెను వెక్కిరిస్తాడు. గుడ్డివాళ్లకు ఎదురువెళ్లి వారిని 'ఢభీ' మని గుద్దేసేవాడు. కుంటివాళ్ల ఊతకర్ర దాచేసి వారిని నానాబాధా పెట్టేవాడు. దారినపొయ్యే బిచ్చగాణ్ణి పిలిచి, జేబులోనుంచి రాయితీసి వారి గిన్నెలో వేసేవాడు. ఇలాటి అల్లరివాడు కృష్ణుడు!

ఇలా ఉండగా ఒకరోజున బలే చక్కని తమాషా జరిగింది. ఓ గుడ్డి బిచ్చగాడు కర్రఊతతో 'అమ్మా.... గుడ్డోణ్ణి! బిచ్చం పెట్టండమ్మా!' అంటూ కృష్ణుడి యింటి ముందుకు వచ్చాడు.

కృష్ణుడు బిచ్చగాడికేక విని బయటకు వచ్చాడు. గుడ్డివాణ్ణి చూసి, వాణ్ణి యెలా అయినా ఏడిపించాలనుకున్నాడు. గబగబా దొడ్లోకి వెళ్లి ఓ కర్ర తీసుకుని, ముసలాడిలా వణుకుతూ....రెండు కళ్లూ గట్టిగా మూసుకుని - గుడ్డివాడికి పోటీగా "బాబూ....అమ్మా!....పుట్టగుడ్డోణ్ణి ...." అని అరుస్తూ, పరుగెత్తుకువచ్చాడు వీధిలోకి....! ఆ రావడంలో చేతికర్ర వీధిగుమ్మానికి తగిలి, ఆ కర్ర కాళ్లలోపడి....బోరగిలా పడ్డాడు!...

ఇం కేముందీ?....పెద్దగా ఏడవ నారంభించాడు. బోరగిలాపడ్డ కృష్ణుణ్ణి తడుముకుంటూ తడుముకుంటూ ఆ గుడ్డివాడు లేవనెత్తాడు. ఇంతలోనే తల్లి వచ్చింది – 'ఎన్నిసార్లు చెప్పాన్రా....? ఒకర్ను వెక్కిరించకురా, తప్పురా....అని మొత్తుకున్నాను. వింటేనా....' అంటూ గూకలేసింది.

ఆ దెబ్బలు సామాన్యమయినవి కావు: కాలు మెలికబడి, ఎముక విరిగింది కృష్ణుడిది! అందువల్ల కష్టపడసాగాడు.

కృష్ణుడు వీధిన పోతూవుంటే, ఇదివరలో అంతా 'కొంటె కిష్టూ !' అని పిలిచేవాళ్లు ! ఇప్పుడలా కాదు — 'కుంటి కిష్టూ !' అని పిలవడం మొదలెట్టారు.



అలా అంతా గేలిచేస్తూన్నా కృష్ణుడుమాత్రం యేమీ అనేవాడు కాదు. తానుమాత్రం అటువంటి అల్లరిపనులు మానేశాడు. తాను ఎగతాళి చెయ్యబట్టేకదా....యీ గతి — అని విచారించేవాడు !

— బి. సంజీవరావు



# జ్ఞానోదయం

గలగలమని శబ్దం చేస్తూ, బిరబిర పరుగులు తీస్తూ, చూడ్డాని కెంతో యింపు కలిగిస్తూన్న ఓ నది ప్రక్కనే ఓ పల్లె వుండేది. ఆ పల్లె కానది ప్రాణంతో సమానం. నది ప్రక్కగానే ఓ పిండిమర పెట్టుకొని, దానిమీద జీవిస్తూ వక డుండేవాడు. అతడి పేరేమో తెలుసా : — ఏమంటే, మణిలాల్ ఉపాధ్యాయ. అయితే, అతన్నేమో అంతా 'మణిలాల్' అని గాని, యింకా ఆప్యాయంగా 'మణీ' అని గాని పిల్చేవారు. చూడండి !....అతడిలా పిలువబడ్తూన్నాడంటే అతడికున్న గొప్పతనము. మంచి తనము మనకు తేటతెల్ల మవుతున్నాయి. అతడు చాలా సున్నితమైన గుండె కలవాడు. అంచేతనే, వెన్నతో యేమైనా యీతని గుండెను భగవానుడు తయారుచేశాడా యని చెప్పుకొని ఆశ్చర్యపడేవారు. కొద్ది కఠినాన్ని ఓర్చ లేడు; కష్టాన్ని చూడలేడు; ఒకర్ని బాధించి యెరుగడు.

పోగా, — అతడికున్న ఆస్తి ఏమిటంటావా ?— పైన చెప్పినట్టు ఆ పిండిమర, ఓ ఆవు, ఓ మాంచి ఎద్దుల జత, మూణ్నాలు గెకరాల మాగాణి వుండేది.

ఆవు సమృద్ధిగా పాలిచ్చేది. ఆ పాడి తనకూ, తన భార్యకు కొరతపడకుండా సరిపడేది. ఎద్దులు దున్నడానికి, బండి లాగడానికి తోడ్పడి, బాగా సహకరిస్తుండేవి. పండిన గింజల్ని పిండికొట్టించి నిల్వచేసేవాడు మణిలాల్. ఆ ఆ యేడు పొడుగునా సరిపడేది.

"నా కింతకంటె మరేం కావాలి ?" అని తన్ను తానే ప్రశ్నించుకుంటూ సంతృప్తి పడేవాడు. "తినడానికి తిండుంది. ప్రక్కనే తీయని జలా లున్నాయ్. ఈ ప్రాంత మంతా నందనవనాన్ని మించి నట్టుంది. నా మర పాతదే కావచ్చు ; ఐతే నేం ?.........నేను ధనికుణ్ని కాను......... కావాలని ఆశకూడాలేదు.........రాజుల్లాగా అంతస్తులు పెంచను....చిత్తుల్లో ధనాన్ని మూలేట్టు చేయను...." అని యింకా యేమేమో చెప్పేవాడు. ప్రతి మాటతోపాటు వినయం అంటివస్తుంది. అది అతడి సంతృప్తిని, సంతోషాన్ని వ్యక్తపరుస్తుంది.

మణిలాల్‌కు ఒకవేళ సుస్తీగనక చేసినట్టయితే ఆవగింజంతైనా లెక్కచేయడు. అదేం చేస్తుంది !....అదే పోతుంది....పోక పీక్కుతింటుందా !....అని అమాయకంగా



మాటాడేవాడు. అతడికి సహచరు లంటేగానీ, యితర ప్రజ లంటేగానీ అమితమైన అభిమానము, గాఢమైన మమకారము. తనెలాగ హాయిగా, సంతోషంగా వుంటాడో తతిమ్మావారున్నూ అలాగే వుండాలని ఎప్పుడూ కొరేవాడు. ఎవరికైనా సుస్తిచేస్తేగాని, ఆకలితో మాడిపోతున్నారంటే గాని, కష్టాల్లో వున్నారంటేగాని — అతడి గుండె తరుక్కుపోయేవి. తక్షణమే పాలు, పెరుగు, నెయ్యి....గింజలు, పిండి — చేతులమీదుగా వారిళ్లకు సాగిపోయేవి. పల్లెంతా అతణ్ని దేవుడుగా భావించేవారు. అతడు, నదిలాగానే — ప్రాణంతో సరితూగసాగాడు. పల్లెజనం మణిలాల్ మరలో [illegible] విసరించినప్పుడు, డబ్బులుకూడా వద్దనేవాడు. మీ దండాలే అంతేచాలు అన్నల్లారా! అని ప్రేమ పురస్సరంగా పలికేవాడు.

"ఇలాగయితే గనక మనం బాగుపడినట్టే!" అనేది మణిలాల్ భార్య వసుంధరారాణి. "గాదెల్లో వున్నదల్లా దానం చేస్తావ్. నా కిదంతా గిట్టదండీ; ఇలాగా నే నేమి బుద్ధి తక్కువదాన్నికాను సుమా!....ఏమను కున్నావో!" అంటూండేది.

నిజానికి రాణి భర్తలాంటిది కాదు. పూర్తి విరుద్ధం. గడ్డిపోసంత దానం చేయదు. "మనకుండే కాస్తా కూస్తా తిండిని పంచి. గ్రుడ్డికి ధారపోస్తే మన గతేంకాను! చస్తారు వాళ్లే బతకలేమంటే!" అనేది దయాదాక్షిణ్యం లేకుండా.

ఒక్కముక్కలో చెప్పాలంటే - మణిలాల్ యింట్లో గనక లేకుంటే, పేదగానీ, సాధువుగానీ ఆ మధ్యలకే అడుగు పెట్టరు. "మణిబాబే లేకుంటే అక్కడి కెందుకుపోవాలి. వసుంధరేమైనా పెట్టుందనా? అదొట్టి అబద్ధం. ఓ నీటి బొట్టు వెయ్యమంటే వేస్తుందా? పోనీ, గడ్డిలోని గింజల్ని యేరుకోనిస్తుందా? ఆమెలాంటి పిసినారి నెక్కడా చూడ లేదు. దేముడా!" అని చెప్పుకొని, కసితీరేంతవరకూ ఆడిపోసేవారు.

అవును; వసుంధరారాణి వాస్తవంగా పిసినిగొట్టే. తమ ఆస్తిమీ దల్లా ఎప్పుడున్నూ కన్నేసి వుంటుంది. ఓ రెప్పపాటుకాలంకూడా యేమారదుసుమా! ఆమె కన్నుగప్పి గనక భర్త దానం చేశాడా! ఐపోయిందిక. ఇన్తెగిరిపోయేట్టు అరిచేది. "దుబారాగా ఎందు కిలా తగలేస్తావ్" అని వాపోయేది.

ఇల్లా కాపురంచేస్తూ — యిరవయ్యేళ్లకల్లా కొన్ని బంగారు నాణాలు చేయించి, నిల్వచేసింది. వాటిని తేనీటి గిన్నెలో వేసి, అటకమీద దాచివుంచేది. ప్రతి రాత్రీ పని ముగించుకొన్నాక, ఆ గిన్నెలో నాణాల్ని లెక్కపెట్టి, అట్టే మట్టంగా దాచుంచేది. అలా చేయడ మామెకు పరమానందం. ఐతే. ఆమె కెక్కడలేని అనుమానం; భర్తేమైనా వాటిని చూసి దానం చేస్తాడా! అని. దోసెడు ధాన్యం దానంచేస్తే చిందరవందరగా యెగిరే మహాతల్లి

ఒక్క బంగారునాణెం పోతే వూపిరైనా పీలుస్తుందా? "బాగా రాసులు రాసులు ధనం సంపాయిద్దాం. పెద్ద పెద్ద మేడలుకట్టి పేటలు పేటలే యేలుదాం" అనేది ఆమె భర్తతో. "ఛా! అదేం మాట. చెత్తమాట. డబ్బులరాసులెందుకు? మేడ లెందుకు? డాబు లెందుకు? ఉన్నదే చాలు. అదే పదివే లనుకోవే. అలా గనుకొని సంతృప్తి పడాలి. అంతేగానీ, ఆశకు పోరాదు వసుంధరా!" అనేవాడు ఫప్పుడూ మణి.

## 2

ఓ రోజు రాత్రి! మణి, రాణీ లిద్దరూ భోంచేసి పడుకోబోతున్నారు. ఆ సమయంలో వంటగది నెవరో మెల్లగా తట్టినట్టు వినపడింది.

వినబడ్డదే తడవుగా రాణి వెళ్లి తలుపు తెర్చింది. ఎదురుగా ఓ బీదఅమ్మాయి దీనంగా నిల్చొనివుంది. అక్కడక్కడ చిరిగిన పచ్చగుడ్డ కప్పుకొంది. కాళ్ళకు కర్ర చెప్పుల్లేవు. నెత్తిన గుడ్డటోపి లేదు. ఎడమచేతిలో మటుకు కర్రపాత్రుంది. ఆ బీదామె రాణీని దైన్యంగా చూసింది. ఎడమచేతిలోని కర్రపాత్రను ముందుకుచాచి యాచించింది. "స్త్రీ! ఈ చిన్నిగిన్నెకు పిండి నింపియ్యండి. పొట్ట మాడిపోతోంది, దయచేసా మాత్రం సాయంచేసి పుణ్యం

కట్టుకోమ్మా ! మీకు నూరేళ్లాయుస్సుంటుంది." హృదయం కరిగేట్టడిగింది. రాణీ ఆమెను క్రిందినుంచీ పైదాకా చుర చుర చూచింది. అనింది గదా! ఆ బీదామెతో - "సరేగానీ ! పిండి నింపిస్తే ఏమిస్తాసంటావు తల్లీ!" అందులోనూ కఠినం ప్రతి ముక్కలోనూ వూడిపడింది.

పాపం! ఆమె బీదామె. "మీ కివ్వడానికి నావద్ద డబ్బుల్లేవమ్మా! క్షమించండి. కానీ, రేపీ వేళకు తిరిగి దీనినిండా అన్నం చెల్లిస్తానమ్మా !" అని చెప్పింది వసుంధరను ఎటుతిరిగీ వప్పించడానికి. "సరిసరి ! బాగుంది నీ వ్యవహారమంతా, నీ వేమో కూటికిలేని బీదదానివి. నీ వేమిటి, పిండిని తిరిగి యిచ్చే దేమిటి ? ఐనా, మీతో మాకెందుకు పేచీలు పోమ్మా !" అని చెప్పేసింది ముఖం మాడ్చుకొని రాణి. ఏమయిందోనని మణిలాల్ వెంటనే వచ్చాడు. అప్పు డప్పుడే రాణీ ఆమె మొఖంమీదనే తలుపు తోసేసింది. "ఏం ? ఏం జరిగిం దేమిటి ?" అని అడిగాడు ఆదుర్దాతో మణిలాల్. "ఎందుకో !" కోపంగా అడిగింది రాణి. అంతటితో ఆగక — "ఎవరో బీదామెట. ఆ చెక్క పాత్రతో పిండి నింపివ్వాలట. మన కింకేం పనిలేదనుకుంది కాబోలు ! పొద్దస్తమానమూ పిండి విసిరేది వీళ్ల వాత పెట్టేందుకే అనుకున్నారో !..... బాగుందిలెండి !.... ఆఁ.... చూడండి ! మన రొట్టెలకు, కేకులకే తక్కువ

పడ్తుందా పిండి. అదే కావాలని వచ్చిందీ మహాతల్లి" చేతులూపి వూపి, కళ్లెర్రచేసి అనింది వసుంధరారాణి.

"చాల్చాలిక. సిగ్గుచేటు వసుంధరా!" అన్నాడు మణిలాల్ పెదవి విరిచి. ఆ చిట్టి పాత్రకు పిండివ్వడాని కామాత్రం రాద్ధాంతం చేయాలా. సరేగానీ, వెళ్లి పెట్టెతెర్చి ఆ పాత్రను పిండితోనింపి తీసుకరా పో! ఈ పిండిమర నాది. గింజల్ని పండిస్తా. వాటిని పిండి కొట్టిస్తా. నే నెట్లయినా దానంచేస్తా. నీ వెవరు వద్దనడానికి? ఊ....



వెళ్లు, నీకే చెప్పేది" అని గదమాయించాడు. రాణీ అతని మాటను మీరి కాదనలేకపోయింది. బీదామె చేతిలోని

పాత్రను ఒక్క వూపుతో లాక్కొని, సరసర పోయింది పిండిపెట్టె వద్దకు.

పెట్టెలో సగంవరకు పిండి వుంది. ఆ చిన్న పాత్ర కెంత పిండి పట్తుందిలే! అనుకుంది రాణీ. ఓ గరిటతో పిండితీసి పాత్రలో వేయసాగింది. పిండి తీసితీసి పోస్తోంది. కానీ, గిన్నె నిండడం లేదు. ఆమెకు విసుగుపుట్టింది. "అరే! దీనబ్బుడాలుగానూ! ఇదెంత పిండయినా మింగేస్తోందే. సామాన్యంగా వున్నట్టులేదే. దీనికథ చూస్తోంటే...." అనుకొని, రాణీ చాలా అబ్బురపడిపోయింది. ఎంతసేపు ప్రయత్నించినా, గిన్నెమాత్రం నిండలేదుసుమా! వెలితిగానే వుండిపోయింది. ఆమెకు బేజారెత్తిపోయింది. "అరే దీనికేమైనా క్రింద చిల్లుందా?" అని వంగిచూచింది. ప్చ! చిల్లెక్కడిది దానికి! పాత్రకేం బాగానే గట్టిగా దట్టంగా, భద్రంగా వుంది. చూస్తే చాలా విచిత్రంగావుందే ఈ గిన్నె!

# 3

వసుంధరారాణి పట్టుదలమనిషి. ఎంత బేజారెత్తినా, ఎంత చెమట ధారలుగా కారినా గిన్నెనుమాత్రం నింపాలని శతవిధాలా యత్నించేస్తోంది. పెట్టెలో పిండి రానురాను తరిగిపోతోందే కానీ, గిన్నెమాత్రం నిండలేదు. ఇంతకూ

పెట్టెలో పిండి యెంతుందంటారా ? — ఇం కెంతుంది ! అరపాతికభాగ ముంది. ఎంతుం టేనేం ! - పాత్ర నిండుతేగా !

రానురాను పిండయిపోయింది. పెట్టె ఖాళీ అయింది గిన్నె వెలితిగానే వుండిపోయింది. రాణికి. కళ్లల్లో నీళ్ల గిర్రున తిరిగాయి. పెద్ద పెద్ద అంగలేసుకుంటూ, బీదామె వద్దకొచ్చి — "ఇదో ! తీసుకో. నే నివ్వగలిగిన పిండంతే...." అని, నోరు తెర్చింది. "ఏంటది ?" బిత్తరతో అన్నాడు మణిలాల్. "పాత్రను నింపలేదేం ? నింపమని నే చెప్పలేదా రాణీ !" నిలదీసి అడిగాడు గుడ్లప్పగించి చూస్తూ.

"నిండిందో లేదో, నాకెందు కదంతా. పెట్టెలోని పిండంతా దీని వాతబెట్టాను. అమ్మయ్యా ! ఎంతపిండి దిగమింగిం దనుకున్నావీ పాత్ర ! అబ్బో ! నే నిలాటి గిన్నెప్పుడూ చూళ్లేదండీ ! ఇదంతా చూస్తే యీామెదో మంత్రం చేసినట్టుంది. మీ కాళ్ల మీదపడి బ్రతిమలాడుకుంటా గానీ, త్వరగా పంపం డీ మంత్రాలమారిని". బెదురుతూ చెప్పింది రాణీ.

"అలాకాదు" మణిలా లన్నాడు బొంగురుపోని గొంతుతో. "ఇది నిండేంతవరకూ ఆమెను పంపించడం జరగదుసుమా ! ఆమెకు మాటిచ్చా. తప్పకుండా యిది నిండి తీరాల్సిందే. మన ఆహారమంతా ఐపోనీగాక ! మాట పోగొట్టుకొంటే మనిషికుండే విలు వేమిటే ?" స్థిర ధైర్యంతొ పలికాడు.

అతడిలా పలుకుతూ, పిండిమర వుండే గదిలోని కెళ్లాడు. రెప్పపాటు పొద్దులో అతడు పిండి సంచితోపాటు తిరిగొచ్చి, దాన్ని క్రిందుంచి — "ఇప్పుడు వాకిలితెరు రాణీ!" "ఆ గిన్నె నిప్పుడు నింపిచూడు" అని చెప్పాడు.

రాణీ ముఖం క్రమక్రమంగా నల్లబడ్తోంది. "ఇట్లా గనకయితే చిట్కాఅంత పిండి మిగల్దులే. తర్వాత నీ యిష్టమిక" అంది రాణి సంచికట్లు విప్పుతూ.

చూడండి !……ఆశ్చర్యం……ఆశ్చర్యం……సంచి లోంచి ఆమె చేతినిండుగా పిండిని తీసి పాత్రలో వేసిందే తడవుగా, ఆ కర్రపాత్ర అంచులదాకా నిండి, క్రిందకూడా పడింది. అరరే! ఎంత వింత!

రాణీ ముఖం చేటంతచేసి చూసింది. ఐతే, నోట్లోంచీమాట పెగిలిరాలేదు. కానీ, పాత్ర నా బీదామెచేతి కిస్తూనవ్వింది. కళ్లల్లో నీళ్లు తెరలు తెరలుగా వస్తున్నాయి.

"మీరు నాకు సాయంచేసినందుకు నమస్కారాలు. మీరు చాలాకాలం బ్రతకాలని దేవుణ్ణి ప్రార్థిస్తున్నా. నే నెళ్లొస్తానిక. ఆఁ, మర్చాగానీ, రేపు తప్పక దీన్నిండా పిండిని బదులుగా పంపుతానుమా!" అని కృతజ్ఞతతో, ఆనందంతో నెమ్మదిగా అనేసి వెళ్లిందామె.

మణీ, రాణీ లిద్దరూ ఒకర్నొకరు చూసుకొని 'అరే' అని బైటికి తొంగి చూశారామె యెటు వెళ్లిందని.

ఏదో ఒక వింత ఆ బీదామెలోవుందని యిద్దరూ అను కొన్నారు. అటు యిటు వెతికారు, కానీ, ఆమె అక్కడ వుంటేగా అవుపించేది!

# 4

కాస్సేపటికి — వసుంధరారాణీ ఏమీ చేయలేక పోయిందిగానీ, అంతపిండి వృథాగా పోయెగదరా! అని ఎంతసేపో చింతచేసింది.

"నా కిలాటి తంత్రాలు సరిపోవు" అనింది నిర్మోహ. మాటంగా. "ఆమె తిరిగి మనకా పిండిస్తుందంటే నే న్నమ్మనండీ!"

"బాగుబాగు", మణిలాలింకా యిలా అన్నాడు. "ఇవ్వకుంటే పోనీలే. మనకు పిండిమర వుంచుకొని అంత మాత్రం దానం చేయకుంటే మరెట్టా. అంతో యింతో దానంచేయడం నేర్చుకోవాలి. తెల్సిందా?"

మర్నాడు మణిబాబు ఝామునే లేచి, పట్నాని కెళ్లాడు యేదో పనుండి. పట్నం చాలా దూరంలోవుంది. అందుకే అతడు తిరిగి రావాలంటే మళ్లీ మరుసటి రోజు పుడయు మొస్తుంది.

ఆరోజు వసుంధరారాణీ యింట్లో ఒంటరిగా వుంది. పొద్దు తిరక్కముందే భోంచేసి, అన్ని తలుపులకీ తాళా లేసింది: తిరిగీ ఎవరైనా క్రిందటిలాగానే మంత్రగత్తె లొస్తారని.

"మా ఆయన ఒట్టి తిక్కమనిషి. కాకపోతే, వున్నదల్లా వూడగొట్టుకొంటే తర్వాత గతేమిటి?" అని అనుకుంటూ, అటకమీదున్న నాణాల్నితీసి పొయిలోని మంటవెల్తురులో లెక్కించసాగింది. ఇంకా పొద్దు గ్రుంక లేదు. ఆ కారణంచేతనే క్రొవ్వొత్తి నామె యింకా వెలిగించలేదు. పొయ్యి చాలావరకు ఎప్పుడూ మండు తూంటుంది. ఆ వెల్తురే దండిగా వుంటుంది. ఈ క్రొవ్వొత్తులు ఒట్టి దండుగే అనేది.

నాణాల్నలా లెక్కిస్తూ, ఆమె ఓ కట్టెను పొయ్యి లోనికి యెగదోయాలని చెయ్యి చాపింది. లేడిమాదిరి బెదిరిపోయి, తటాల్న వెనక్కు జేరగిలబడింది. ఎంచేతంటే- ఎదురుగా జానెడే జానెడంత చిన్నబ్బాయి నిల్చొనివున్నాడు.

లోనికి వాడెట్టా వచ్చినట్టు! చాలా ఆశ్చర్యంగా వుందే! కిటికీలు మూసివున్నాయి. వాకిళ్లకు తాళాలేసి వున్నాయి. ఇనప్పెట్టెలా గుంది అచ్చం యిల్లంతా. కల మాగిన పండుగదా! చెట్టునుంచి జారిపడినట్లు, వీ డెక్కడ నుండి జారిపడ్డాడో! రాణీ బ్యారుమని నోరు తెర్చింది వాణ్ణి జూస్తూనే.

వాడు చూస్తే వాళ్ళింట్లోవున్న ముక్కాలిపీటకంటే పొట్టే. జుట్టుకొణ్ణుంచి గోటిదాకా పచ్చదుస్తులు ధరించాడు. ముందు రోజొచ్చి పోయిన ఆమె గుడ్డలరంగే వీడి గుడ్డల రంగున్నూ. కళ్లు నల్లగావున్నాయి. మిల మిల మెరుస్తున్నాయి. పళ్ళు తెల్లగావుండి, కాంతు లీనుతున్నాయి. వాడి రెండు చేతుల్లోనూ కర్రపాత్రను పట్టుకొన్నాడు. అందులో నిండుగా పిండుంది. ఆ పాత్రను ఆ అబ్బాయి ఆమె కిస్తూ, యంత్రానికిమల్లే ప్రతిధ్వనించే గొంతుతో — " అమ్మా ! మా యజమానురాలు నిన్న తీసుకపోయిన పిండికి బదులుగా దీన్నిండా పంపింది. ఇదెంతో బాగుంది. తీసుకొని చూడండి " అని చెప్పాడు.

" మీ యజమానురా లెవరు అబ్బాయీ ! " పాత్ర నందుకుంటూ అడిగింది నోరు పెద్దగా తెరిచి అంతులేని ఆశ్చర్యంతో.

" దేవకన్యకల రాణీ ! " అని చెప్పాడు ఆ పొట్టి అబ్బాయి. మాటాడ్తూంటంగనే వాని క్రిందున్న పలకలు భూమిలోనికి విరగబడిపోయాయి. వాడా గుంతలో గభాల్న పడీపడ్డంతోటే గొప్ప వెల్తురుపుట్టింది. జిగేల్మనేసరికి రాణీ కళ్ళు మూసుకొంది. కళ్ళుతెరిచి చూచిందిగదా ! పొట్టివాడూ లేడు, వెల్తురూలేదు, మునుపు పలకలెలాగ వున్నాయో అలాగే వున్నాయి. అరే ! ఇదేం విచిత్రం !

# 5

రాణీ తికమకపడింది, అంతా ఓ క్షణంలోనే యిదంతా జరిగింది చూడండి! నిండుగా పిండున్న పాత్ర మాత్రం రాణీ చేతిలో వుంది. "ఇది దేవతల ఆహారమట! "తనకు తానే పలుక్కుంది. "సరే! నేను దేవతల ఆహారం ఎప్పుడూ రుచి చూళ్లేదు. కాస్త రుచి చూస్తే నెలా గుంటుందో! దేవకన్య లట! ఎంత బావుంటారో వాళ్ళు! మా అమ్మ చెప్పగా వినడమే వీళ్ల సంగతి. అందులోనూ, అదీవిని యెన్నాళ్లాయె నబ్బా!

రాణీ యిలా అనుకుంది — "అమ్మయ్యా! ఆమె రాణీ యట! ఐతేనేం? ఆమె వచ్చినపుడు యెంతో నమ్రతతో మాటాడాను. ఈమె యెంత మంచిదిరా అని ఆమె అనుకోకుండా యెలా వుంటుంది. అదే పనిగా పిండిసి పంపకుంటే నాణాల్ని పంపకూడదో!"

ఆమె ఆ పిండితో వంట చేయసాగింది. కొద్ది పిండితోనే వంట చేసింది అందులోనూ. తతిమ్మా పిండి నట్టే పాత్రలోవుంచి, అటకమీద తేనీటి గిన్నె వెనకాల దాచింది, "ఇదక్కడే వుండాలి. లేకుంటే, ఆయనచూచి ఇదెక్కడిదీ? అని ప్రశ్నిస్తాడు. ఆయన ఒట్టి చాదస్తం మనిషి. చూస్తే గనక దినమూ వాళ్లకు నైవేద్యం పెట్టా లంటాడు. వాళ్లేమో మాయగావచ్చి తినిపోతే మా యిల్లు

గుల్లపడిపోక పోతుందా ?" అని పిచ్చిగా ఆలోచించింది. అంతలోనే వంట తయారైంది. నింపాదిగాకూచొని తిన సాగింది. "ఆహా! ఎంత రుచి. ఎంత రుచి. నా జన్మలో నైనా యిలాంటిది రుచి చూశానా ?" అని తరించింది.

చెమ్చానిండుగా తీసుకోడం, నోట్లో వేసుకోడం, తిరిగీ తీసుకోడం.........ఇలా చేస్తూ — "బాగుంది" అంటూంది. "అసలు వాళ్లకు గింజల్ని విసరిండం అవన్నీ బాగా తెలుసే! అది కాదుగానీ. ఆమె పిండినే బదులుగా యివ్వకుంటే నాణాల్నిచ్చుంటే — అబ్బ! బంగారు......... బంగారు....ఓహో! ఏం బంగారోలే! చెప్పాలా యిక. ఈ పిండి మరలో అయ్యే పిండంతా బంగారుగా మారాలి. పిండయితే ఏం బాగు! ఎప్పుడూ పిండేనా ? అంతా బంగారే ఐతే, ఎన్ని రాజ్యాలో యేలితే....అప్పుడిక చెప్పాలా ? అంతా తళతళలు....మిలమిలలు....అబ్బబ్బబ్బబ్బబ్బ....;" అని కోరికలు కోరుకుంది.

# 6

మరుదినం రమారమి సూర్యో డుదయించే సమయాని కల్లా మణిబాబు తిరిగొచ్చాడు. కానీ, సరాసరిగా యింటికి పోలేదు. నేరుగా పిండిమర కెళ్లాడు విసరాల్సిన గింజలు బస్తాలతో నున్నందున.

మర నాడించడానికి — చక్రానికి పట్టను తగిలా డించాడు. మర గిర్రనీ తిరుగసాగింది. గింజలను అత డెత్తి పైన పోయసాగాడు. క్రింద పిండికి బదులుగా బంగారు నాణాలు గొలుసులాగ ఒకదాని వెనక మరొకటి వేగంగా వచ్చి బైట తొట్టెలో పడ్తున్నాయి. వాటిని చూసే టప్పటికి అతడికి వళ్లంతా వులకరించింది. ముఖమంతా వికసించింది. హృదయ మంతా ఆనందసాగర మైంది. సంతోషమే మణిబాబు; మణిబాబే సంతోషము.

అత డలాగే నిల్చుండిపోయాడు - నోరు తెర్చుకొని వాటిని చూస్తూ, అతడు అమితంగా ఆశ్చర్యపోయాడు. నిజమే మరి! పిండికి మారుగా నాణాలు రావడమంటే అబ్బురంకాదా! అతడు గింజల్ని పాత్రలతో ముంచి ముంచి పోయసాగాడు. నాణాలు గంగ ప్రవాహంలాగా, నయాగరా జలపాతంలాగా జలజల బైటికి రాసాగాయి. వేలు.... లక్షలు....కోట్లు....లెక్కలకందనన్ని నాణాలు మర దగ్గర లోను, దూరములోను, ఆ మూల, ఈ మూల........ ఎటుచూసినా బంగారుమయమే. ఇంట్లోనే బంగారుగని వున్నట్టుంది. ఇల్లంతా పసుపుపచ్చని కాంతులతో, తళతళ లాడే మెరుపులతో, నిగనిగతో నిండిపోయింది.

మణిబాబుకు మూర్ఛ వచ్చేటంత పనైంది. ఏమిటీ! ఎటుచూచినా బంగారు! నోట్లోమాట నోట్లోనే వుండి పోయింది. భార్యను లాక్కొస్తామని వంటయింట్లోనికి

పరుగెడ్తూండంగనే – " హో ! ఏవండీ ! ఇక్కడి....కి.... రాం....డీ ! నా మెడచుట్టూ ఏంటిది ? గుదిబండ లాగుంది. అబ్బా ! ఎంత బరువు ! ఎంత బాధ ! వచ్చి దీన్ని తీద్దురు రాండీ !....అని భార్య గట్టిగా అరవ మొదలుపెట్టింది. మధ్య మధ్య యేడ్పులు, పెడబొబ్బలు మరింత గోల చేస్తున్నాయి.

వసుంధర వంటింటి వాకిటికాడ వచ్చి నుంచుంది. నానా అవస్థపడి. వాకిట కలాగే జేరగిలబడింది. మెడ చుట్టూన్న విసుర్రాయికూడా బంగారుమయమే. అయితేనేం ? బరువుకు తాళగలిగి వుండాలిగా !

" అబ్బా ! అమ్మో ! " యేడ్వడం ఆరంభించింది. " ఇంకెలా దీంతో నే బతికేది ? ఇంత భారీ గుంది. ఇంత పె....ద్ద....ది....అమ్మయ్యో ! నే భరించ లేకున్నాను. ఎంత తీద్దామన్నా రాదే ! అయ్యయ్యో ! మీరే చూడండీ ! అబ్బబ్బా ! రానురాను బరువెక్కి కదలకుండా ఐపోయింది. ....హబ్బా ! " వాపోయింది.

ఆమె యిల్లంతా నిండిపోయిన బంగారు నాణాల్ని చూళ్లేదు. మెడచుట్టూ గుదిబండేగనక లేకుంటే — ఆమె వూరకుంటుండెనా ! ఏం బంగారు ! ఎన్ని నాణాలు ! అబ్బో.... అబ్బో....అని ఆశ్చర్యపడక పోవునా ?

అతడా బంగారు గుదిబండను తొలగించాలని యత్నించాడు. కానీ, అసలు కదిల్తేగా ! పాపం ! అది చచ్చేంత

పని చేసింది. వసుంధర తూలుతూ, సోలుతూ లేచి పద్మా లోని కెళ్లిపోయింది.

నిజంకాక ఎట్టాపోతా యామెకోరిన కోర్కెలు ! దేవతలు పంపి నాహారం తింటూ తల్చుకొన్న కోర్కెలు రూపాల్ని పొందాయి. మరలోంచి బంగారు నాణాలు అలాగే యింకా వస్తున్నాయి. ఎటుచూచినా బంగారే ! వసుంధరారాణీ గుడ్డలు, గుడుసులు, జోళ్ళు....అన్నీ బంగారువే ఐనాయి. ఎటుపోయి ఆమె ఏది ముట్టినా తళుక్కునే బంగారుగా మారడమే.

# 7.

తొట్టతొలుత మణిబాబు పిండి మరంతా బంగారుతో నిండినందు కెంతగానో సంబరపడ్డాడు. " ఓ పిండిబస్తా కంటె బంగారుబస్తా బోలెడు ఖరీదుచేస్తుంది. నే నిప్పుడు బీదలకు దండిగా బంగారును దానంచేస్తా, వా రెంతగానో ఉవ్విళ్లూరుతారు. నాణాల్ని కళ్లకద్దు కుంటారు " అని చాలా వుప్పొంగిపోయాడు. బీదలకెలాగా సాయంచేస్తే బావుం టుంది... వారి కేదిస్తే మెచ్చుకుంటారు....అని పొద్దస్త మానము తలంచేవాడు.

ఆరోజు సాయంత్రం ఓ ముసలాయన ఓ బస్తా ధాన్య తెచ్చాడు పిండి చేయడానికి. మణిబాబు మర నాడించి ధాన్య మెత్తి పైన పోశాడు. క్రిందనుంచి బంగారుకాయలు దాదాపు రెండు సంచులకు పైగా దొర్లుతూ వచ్చాయి. ఆ ముసలాడు ఆహా! బంగారు....బంగారు! అని ఎగిరి గంతులేచాడు. వాటి నన్నీ భుజమ్మీది కెత్తుకున్నాడు తంటాలుపడి. ఇంటి కెళ్లిపోతూ—"ఓ! ఎంత అదృష్ట వంతుడివి నాయనా! నీకు బంగారుమర వుంది. నీ విక పైప్రపంచంలోనే ధనవంతుడ వైపోతావ్!

"నిజమే కావచ్చు" అన్నాడు మణిబాబు. "మర యితే. ఒక విషయం జ్ఞప్తి నుంచుకో. మీ కెంత బంగారు కావల్సివస్తే అంత పట్టుకెళ్లండి!" ఎంతో ఉదారంతో చెప్పాడు.

సూర్యుడు పడమటి దిక్కున మునక్కముందే లెక్కకు రానంతమందికి బంగా రిచ్చాడు. కమ్మరికి, కుమ్మరికి, కూలీకి మాలీకి, కష్టజీవికి నష్టజీవికి....అబ్బా! ఎంతమందికోలే! కనబడ్డ ప్రతివాడికీ యిచ్చాడు. ఎవడి చేతిలో చూసినా కనకమే! ఏ నోట విన్నా సుద్దులే!

వసుంధరిదంతా చూణ్ణే చూళ్లేదు. అతడు దానం చేయడం గనకే చూసుంటే చిందరవందర యెగరకపోవునా! ఆమె ఆ బంగారు గుదిబండబాధకు ముక్కుతూ, మూల్గుతూ

ఓ మూల కూలబడింది. ఇంక ఆ బంగారుబండ తొలగదేమో పాపం! అట్టే వుండిపోతే ఆమెగతేం కాను!

ఆ రోజు గడిచిపోయింది. తెలతెల వారింది. సూర్యుడు తూర్పున పొడుచుకొని వస్తున్నాడు. గతరాత్రి బంగారుబస్తా లెత్తుకపోయిన వ్యక్తి కర్ర నూతబొడుచుక వస్తున్నాడు. మణిబాబు అతణ్ణిచూచి నివ్వెరపోయాడు. "ఏం తాతా!" అని ప్రశ్నించాడు. ముక్కుపుటాలు వుబ్బినాయి. "నిన్న పట్టుకపోయిన బంగారంతా అప్పుడే ఐపోయిందో! అన్నాడు.

"బంగారేమిటి బంగారు?" హీనస్వరంతో పలికాడు ముసలాడు. నీ వింత మోసం చేస్తావని నే నెప్పుడు అనుకోలేదు కొడుకా! సంచులకట్లు విప్పేసరికి లోపల యేముందో తెలుసా? — నున్నటి పసుప్పచ్చని మన్ను. బంగారుకాదు.

"అయితే వుండు. మా బస్తాలు చూడనీ" అంటూ తన సంచుల కట్లను విప్పి చూడడమే తరవాయి, అన్నీ మన్నుమయమే. అతని గుండెలు బద్దలయ్యాయి. దుఃఖం చెప్పరానంత పొర్లివచ్చింది, భోరుమని యేడ్చాడు. పాపం! ఎంతదగా! బంగారు తీసుకవెళ్ళిన వారంతా యింటిమీద విరుచుకపడ్డారు. అతడిమీద అంతా నోర్లు చేసుకొన్నారు.

తిట్లు, చీవాట్లు కట్లు త్రెంచుకొన్నాయి. చేతులుమాత్రం చేసుకోలేదు. ఏదయినా మోసంజరిగితే కొంచెం సయించరు వారు.

మణిబాబు నోరు బిగుసుకపోయింది. ముఖం పాలిపోయింది. బలవంతంగా నోరు తెరిచాడు. "ఇందులో నాదేం తప్పుంది. మీరే చెప్పండి" ప్రాధేయపడినట్టు పలికాడు. "మిమ్ములను వంచించాలని నా కెప్పుడూ చెడు బుద్ధి లేదే! అబ్బే! నన్నెందుకలా నిందిస్తారు. నేను మీ కిచ్చింది బంగారే. కానీ, అది అలా మారడం మాయ."

"ఆగండి. దాని కథంతా నే చెప్తా గానీ. నెమ్మదిగా వినండి" — అన్నాడో ముసలాడు కడకు కలగజేసికొని. "ఇదంతా దేవతాస్త్రీల మాయ. ఒట్టి బూటకం. వారిచ్చింది చూచి బంగారమే అని భ్రమపడ్డావు. నిజాని కది కేవలం మట్టి. ఇదంతా చిన్నప్పుడు మా అవ్వ చెప్పేది. సరే! ఐందేదో ఐంది. కానీ, నీ మర బంగారుమరగానే వుందని ఆశపెట్టుకోకు నాయనా!" అని వోదార్చి, వూరడించి వెళ్ళిపోయాడు. జనమంతా మెల్లిగా పల్చబడిపోయారు.

# 8

ఇలా కొన్నిరోజులు గడిచాయి. పిండిమర పరిస్థితి క్రమేపీ అధ్వాన్నమైపోతోంది. మణిబాబుకు దినదినానికి దిగులు మరీ ఎక్కువవుతూంది. అనుకోకుండానే మరలో మార్పొచ్చింది. తుదకు, మరకు తాళమేసేసి, ఆ చుట్టు పక్కల తొక్కైనా చూళ్లేదు.

వారాల, నెలల తరబడి పిండిమరను తెరవలేదు. పిండి కొట్టించడానికి గింజలనుకూడా ఎవరూ తేలేదు, ఎందుకు తెస్తారు? వాళ్లేం అమాయకులా? సంవత్సరం పొడుగునా పండించిన ధాన్యాన్ని నున్నటి మట్టిక్రింద మార్చడాని కిష్టపడ్తారా!

వాళ్లదగ్గరున్న పిండి ఖర్చయిపోయింది. "ఏమండీ! ఆహారమేమో ఐపోయింది. పట్నానికెళ్లి పిండి తీసుక రాండి. మన మర మనకే చెరుపైంది. మన గింజలన్నీ మట్టయ్యాయి. పోనీగానీ, నా దగ్గర బంగారుకాసు లున్నాయి. వాటిని అటకమీద దాచివుంచాను. అవి పట్టుకపోండి. అవేమీ దేవతాస్త్రీల సొత్తుకాదు లెండి. ఐనా, వాటిని చూడాలంటె నాకు ఎకసక్కెంగా వుంది" అంది.

మణిబాబు వెళ్లి తేనీటిగిన్నె తీయబోయి దేవరాణి పంపిన కర్రపాత్రతీసి — "ఏమే! ఇక్కడ పిండి వుందే!" అని గట్టిగా అరిచాడు.

"ఆఁ! పిండా? దాన్ని ముట్టుకోకండి దయఛేసి"— అతడికంటె రెండింతలు గట్టిగా అరిచింది, "అది దేవతాహారం. అది తింటే మరీ కష్టాలు రెట్టింపవుతాయి. అది నేను తిన్నందుకే యీ కష్టాలు దాపురించాయిసుమా!" అని పాతకథ ఏకరువు పెట్టింది. మణిబా బలాగనే నిబ్బరంగా నిల్చుండిపోయాడు.



కాస్సేపు గడిచింది. "అయితే విను. నేనూ దీనితో వంట తయారుచేసి భోంచేస్తా. భోంచేస్తూ నీలాగే కోర్కెలన్నీ కోరుకుంటా. ఏం జరుగుతుందో నే చూస్తాగా!" అన్నాడు మణిబాబు.

"నీ యిష్టం. నాదేముంది. కష్టాలు కోరి కొని తెచ్చుకోండి" అని మాత్రం అంది.

మణిబాబు చెప్పినట్టే వంట తయారుచేసి, చెమ్చాతో నోట్లో వేసుకొన్నాడు. నోట్లో ముద్దపడిందో లేదో గట్టిగా అరిచాడు : ఆహాహా ! ఎంత బావుంది. ఎంత రుచిగావుంది. ఇంత యింపైన పిండిని మర యివ్వాలని, అందులోనూ మన మర యివ్వాలని బలే ఆశ. ఇలాంటిదిగనక వస్తే, బీదలకందరికీ పంచితే, అప్పుడు నన్ను మెచ్చుకొంటారు, మెచ్చుకోక వూరుకుంటారా ? నే నేమో బలేగా కోరు కుంటున్నా. అమాయకురాలైన నా భార్య మెడచుట్టూవున్న బంగారు విసర్రాయి లేదనుకుంటా" అని కోరాడు.

కోరే కోర్కెలనుబట్టీ, ఆశించే ఆశయాన్నిబట్టీ ఆశలు ఫలిస్తాయి. మణిబాబు భార్యలాగాకాక తృప్తికరంగా కోర్కెలు కోరాడు. అత్యాశకుపోలేదు, పూర్తి భిన్నంగా కోరుకున్నాడు.

మాటలు అన్నదే తడవుగా వసుంధర మెడచుట్టూ వున్న బంగారు గుదిబండ మాయమైంది. ఆమె సంతోషంతో కెవ్వున కేకేసింది. రివ్వున ఎగిరి నాట్యమాడ సాగింది. ఏమిటీ కేకని మణిబాబు చూడగా ఆమె మెడచుట్టూవున్న పీడ విరగడైంది. అతడున్నూ సంబరంతో గంతువేశాడు.

కాస్సేపట్లోనే — అతడు తలంచిన కోర్కెలు ఫలించ సాగాయి. పిండిమరతాళా లవంత టవే విడిపోయాయి.

మర గిర్రున తిరుగసాగింది. కమ్మనిపిండి ఝుమ్మని రాసాగింది.

మణిబాబు అప్పట్నుంచీ పిండి నిత్యర్లకు దానంచేయ సాగాడు. తనింత తిని - తతిమ్మా ఆహారం బీదసోదరులకు పంచిపెట్టాడు.

అనుభవించినాక కష్టాలలోని గొప్పేమిటో, తప్పేమిటో తెలుస్తుంది. వసుంధర మనసప్పట్నుంచీ మారింది. తనూ భర్తలాంటి మనసు తెచ్చుకుంది. ఆనాటినుంచీ తన చేతులమీదుగా దానంచేయ సాగింది. ప్రేమపూర్వకంగా మాటాడింది. ఆదరంతో పలకరించింది. వసుంధరారాణికి జ్ఞానోదయమైంది.

ఆమె ఏమాత్రమూ బంగారుకాసుల్ని నిల్వచేయ లేదు. మనస్ఫూర్తిగా దానంచేయడం, మనుష్యుల మెప్పు పొందడం, మంచితనం సంపాదించడం — బాగా అలవర్చుకుంది వసుంధర.

కుంటికి, గ్రుడ్డికి, నడ్డివాడికి....వాడికి వీడికి అనడమేల? కూటికి, గుడ్డకు, నీడకు మొగమువాచిన వారికల్లా మణీ, రాణీల పిండిమర ఆశ్రయమిచ్చింది. వారి గృహమొక పోషణాలయమైంది. వా రిరువురు ధన్యజీవు లయ్యారు.

[ ఆంగ్లకథకు అనుసరణ ]

— 'మాణిక్యం,' 'వల్లంకొండ'



కథలు కథలు కథలు

ఇంకా............

మామకథలు
కొయ్యగుర్రం
నాగులు
ఛప్రాసీ
చిలక చదువు
నీతికథానిధి

కథలు కథలు కథలు



## మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA106B 170 |
| పుస్తకం పేరు | కాలేజ్ డేస్ |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | ii, BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Hema |
| పేజీలు విడదీసినది | Hasin |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | lakshmi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |